Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యూం I.] మద్రాసు : 1941 వ సం॥ సెప్టెంబరు నెల 26 వ తేది శుక్రవారం [నెం 28 రు

## అమెరికా తాటస్థ్య చట్టం.

### బ్రిటను, రష్యాలకు సహాయంచేయుటకు నిరోధంగా వుంది.

### చట్ట నియమాలు : సవరించాలను ఆందోళన.

విదేశములతో అమెరికా సంబంధములగూర్చి చాల ప్రధానమగు ప్రకటనను అమెరికా విదేశాంగ మంత్రియగు కార్డెలు హలుగారు ప్రకటించిరి. వీరుగావించిన సూచన అంగీకరింపబడినచో హిట్లరుతో యిపుడు మిత్రమండలివారు జరుపుచున్న యుద్ధమునందు గొప్ప మార్పు జరుగగలదు. అమెరికాలో అమలునందున్న తాటస్థ్యచట్టము సవరించుట అవసరమని మంత్రి హలుగారు తెలిపిరి. ఈ చట్టం వలన అమెరికా సంయుక్తరాష్ట్రముల ప్రభుత్వం యుద్ధంలో దిగకుండుట కెంత అవకాశము కలదో, దిగుటకును అంత అవకాశమే గలదు. తాటస్థ్య చట్టమునందు ఆయుధాల ఎగుమతి నిషేధం లేనప్పటికి ఇంగ్లాండు మున్నగు దేశములకు కావలసిన సహాయమంతా పంపుట కది ప్రతిబంధకము గనే యున్నదని హలుగారి ఉద్దేశము.

యుద్ధం ప్రారంభమయినప్పటికి యిప్పటికి అమెరికా విదేశవిధానమునందు ఎంతో మార్పు సంభవించింది. ప్రారంభంలో అమెరికా యించుమించు "నన్నుముట్టకు నామాలకాకి" అన్నట్టుగానే యుండెను. అప్పట్లో చేంబరులేను గారి రాజీపద్ధతులు నచ్చక, బ్రిటిషు విదేశవిధానమునందు అమెరికాకు నమ్మకంలేక, యించుక అనుమానంకూడా యుండెను. కాని హాలెండు, ఫ్రాంసులు పడిపోయిన తరువాత అమెరికా ప్రజాభిప్రాయమునందు మంచి మార్పు కలిగింది. హిట్లరుయొక్క మెరుపుయుద్ధం ఒక్కదేశాన్ని వుద్దేశించిందికాదనియు, ప్రపంచాన్నంత ఆక్రమించే ఎత్తులలో నొకటనియు, ఇంగ్లాండు పడిపోయినచో తరువాత అమెరికావంతనియు అమెరికాప్రజలు గుర్తింపసాగిరి.

### రూజువెల్టుగారి కృషి.

రూజువెల్టుగారు ఎన్నికలో తనను ఎదిరించిన వెండలు విల్కీగారి ప్రోద్బలంతోగూడ నాజీలను ఎదిరించిన ఇంగ్లాండు మున్నగు దేశాలకు వీలైనంత ఎక్కువసహాయం చేయాలని తలపెట్టిరి. కావున అమెరికా తాటస్థ్యము మనోవాక్కర్మలం దెచటలేకుండెను. ఇంగ్లాండు మిత్రమండలివారు కావలసినన్ని ఆయుధాలు అమెరికానుండి తెప్పించుకొన వీలుండునట్లు అరువుకౌలుచట్టం ఆమోదించబడెను. నౌకలు, విమానాలు, టాంకులు ఒకటేమిటి యుద్ధానికికావలసిన సరకంతా మిత్రమండలికేగాక రష్యాకుగూడ పంపబడినది. అట్లాంటికు మహాసముద్రంలో కనబడిన శత్రుజలాంతర్గామిని, యుద్ధనౌకను, కనబడగానే ముంచివేయాలని అధ్యక్షుడు నౌకాదళానికి ఆజ్ఞాపించెను. ఇట్టి కఠినచర్యలు గైకొనుటకు కారణం అమెరికాగూడ యితరదేశాలతోబాటు నాజీ తత్వమునకు ప్రతికూలంగానుండు టొకటి; ప్రపంచాధిపత్యం వహింపాలను నాజీ దురాశలను అణచివేయాలని అమెరికా కోరడం రెండవది; మూడవది, మిత్రమండలికి అవసరమగు యుద్ధసామగ్రి పంపుటచే అమెరికా ఆత్మరక్షణయే చేసుకొంటున్నది కావున తాటస్థ్యచట్టమునకు విరుద్ధంకాదని వారు నమ్ముట.

### తాటస్థ్యచట్టంలో ఏముంది?

**1933-37** సంవత్సరాలలో అమెరికా తాటస్థ్యచట్టం నాల్గుమార్పులు చెందింది. **1937** వ సం॥ చట్టంలో అమెరికా జాతీయశ్రేయమునకు అవసరంలేవని తలంపబడిన కార్యము లెన్నో అమెరికనులు చేయరాదని నిషేధింపబడిరి. యుద్ధంచేస్తున్న దేశాలకు అమెరికనులు ఆయుధ సామగ్రి ఎగుమతి చేయరాదు; యుద్ధంచేసే దేశాలకు తిరిగి ఆయుధాలనుపంపే అవకాశంగల తటస్థదేశాలకుగూడ ఆయుధాలు ఎగుమతిచేయరాదు. సంగ్రామిక దేశాల సెక్యూరిటీలతో అమెరికనులు వ్యాపారంచేయరాదు. ఆదేశాలకు అమెరికా నౌకలు ఆయుధాలను తీసుకపోరాదు. వర్తకనౌకలు ఆయుధాలను అమర్చుకోరాదు. యుద్ధంచేస్తున్న (సంగ్రామిక) దేశాలయొక్క నౌకలపై అమెరికనులు ప్రయాణం చేయుటగూడ తప్పే. **1939** వ సంవత్సరాంతంలో అధ్యక్షుడు రూజువెల్టుగారు ఆయుధాల ఎగుమతి నిషేధం తీసేయాలని శాసనసభయగు కాంగ్రెసును కోరిరి. తటస్థ చట్టంలోనున్న ఈ నిషేధం అమలునందున్నంతకాలం, తటస్థ రాజ్యాలగు ఇటలీ, రషియా మున్నగు దేశాలద్వారా జర్మనీ అయుధాలను అమెరికానుండి తెప్పించుకొన వీలుండును; చుట్టుసముద్రాలుండుటచే ఇంగ్లాడునకు అట్లా యితర దేశాలద్వారా తెప్పించుకొనే అవకాశముండదు. అధ్యక్షుని సూచన అంగీకరించబడెను. తరువాత అమలునందున్న తాటస్థ్య చట్టంలో 5 ముఖ్య నియమములు యీ దిగువ రీతిగ గలవు.

### యుద్ధ పరిస్థితు లున్నట్లు ప్రకటన.

విదేశాలలో ఏవేనా యుద్ధం చేసుకుంటూవుంటే, అమెరికా సంయుక్త రాష్ట్రములందు శాంతికాపాడుటకు రక్షించుకొనుటకును, అమెరికా ప్రజలను రక్షించుటకును అవసరముందని అధ్యక్షునకు తోచినపుడు, ఆ దేశాలపేర్లనో తెల్పుచు అధ్యక్షుడొక ప్రకటన చేయును. ఇతర దేశాలుగూడ యుద్ధంలో దిగుతూవుంటే వాటి పేర్లనుగూడ చేరుస్తూవుండును.

**1937** వ సం॥ చట్టంలోనుండిన ఆయుధాల ఎగుమతి నిషేధ నియమం తీసివేయబడింది. ఈ సవరణయందలి మాటల పొందికవలన, తాటస్థ్యచట్టం అమలు జరుపకుండానే విదేశాలందు యుద్ధంవున్నట్లు గుర్తించుటకు వీలగును. చిన్న సంస్థానముల అంతఃకలహములున్నపుడును చీనా-జపాను, రషియా-ఫిన్లాండు యుద్ధాలందుగూడా తాటస్థ్య చట్టమును అమలుజరుపుట అమెరికాకు శ్రేయస్కరం కాకపోవచ్చును. అధ్యక్షుని ప్రకటనను కాంగ్రెసు ఆమోదించవలసియున్నది. కావున చట్టం అమలుజరిపే బాధ్యత అధ్యక్షునితోబాటు కాంగ్రెసుగూడా పంచుకొనును.

## యుద్ధ రంగములు.

అమెరికా ప్రజల రక్షణ అవసరమని తోచినపుడు, అధ్యక్షుడు యుద్ధరంగ ప్రాంతములేవో పేర్కొని, వాటి దరికి అమెరికా నౌకలు పోరాదని నిషేధింపవచ్చును. విమానాలకుగూడ యీ నిషేధం వర్తించును. ఈ నిషేధాజ్ఞ నుల్లంఘించిన శిక్షలు విధించబడును. అధ్యక్షుని చిత్తం వచ్చినపుడు అవి యుద్ధరంగాలు కావని తిరిగి ప్రకటింప వచ్చును. కార్య నిర్వాహకాధికారులకే యుద్ధరంగాలేవో, త్వరగా చర్య తీసుకోదగ్గ సమయం స్థలం ఏదో నిర్ణయించు విషయ పరిజ్ఞానం వుండును కావున, అధ్యక్షునికే యీ అధికారం అంతా ఒసంగబడెను.

## యుద్ధంలోదిగిన దేశాలతో వాణిజ్యంకూడదు.

యుద్ధంలో దిగిన దేశాలకు అమెరికా నౌకలేవీగూడ ప్రయాణీకులను సరకులను రవానాచేయరాదు. వీటికి కొన్ని మినహాయింపులుగలవు. అట్టి దేశాలకు రవానాచేయు సరకులు దారిలో యితర దేశాల చర్యలవలన నష్టమయినచో అమెరికా ప్రభుత్వం ఆదేశాలను నష్టపరిహారంకోరదు. యుద్ధం చేస్తున్న దేశాలకు అరువాసంగు అమెరికనుల తరఫున అమెరికా ప్రభుత్వం బాధ్యత వహించి రాజకీయ రాయబారాలు కొనసాగింపదు.

మినహాయింపులేవనగా, యుద్ధానికి సమీపం కానటువంటి దేశాలతో అమెరికా నౌకలు వర్తకం చేయవచ్చు, ప్రయాణీకులను తీసుకపోవచ్చును. కాని మందుగుండు ఆయుధాలు మాత్రం తీసుకపోరాదు. దీనివలన కనడావంటి దేశాలతో మామూలు ప్రకారం వర్తకం సాగించుకొనే సౌకర్యం తొలగిపోలేదు. యుద్ధంలోదిగిన దేశాల ప్రజలతోను, తటస్థ దేశాలతోనుకూడ ఆయుధవ్యాపారముతప్ప యితర సామాన్య వ్యాపారం చేసుకోవచ్చు. అట్లాంటికు దక్షిణ రేవులు పడమర రేవులతోను, హిందూ మహాసముద్రం రేవులతోను వర్తకం చేసుకోవచ్చును. కాని యుద్ధం జరుగుచున్న ప్రాంతాలకు మాత్రం అమెరికా నౌకలు ఎట్టి సందర్భాలలోను పోరాదు. ఉత్తర అట్లాంటికు, నార్వేలోని బెర్గెను రేవులతోగూడ వర్తకం చేసుకోవచ్చును.

## ఆర్థిక వ్యవహారాలు.

యుద్ధంలో దిగిన దేశాలతో క్రొత్త వ్యాపారము ఏదిగాని అమెరికనులు చేయరాదు. ఆ దేశాల సెక్యూరిటీలు, ప్రభుత్వ ఋణపత్రాలను కొనరాదు. ప్రాత ఖాతాల ప్రకారము అదివరకేవున్న కాంట్రాక్టులను నిర్వహించవచ్చును. ఆ దేశాల ప్రైవేటు వ్యక్తులు ప్రభుత్వం తరఫున కాక స్వంతంగా వ్యాపారం చేస్తున్నవారికి అమెరికావారు అరువుకూడా యివ్వవచ్చును. కాని ఆయుధాలు యుద్ధపరికరాలను మాత్రం ఆ దేశాలవారెవ్వరికి అమ్మరాదు.

## అమెరికా పతాకం అక్రమంగా వాడుట.

ఇతర దేశాల నౌకలు అమెరికా పతాకమును వుపయోగించుట న్యాయవిరుద్ధ చర్యయగును. ఉపయోగించిన నౌకలు మూడు నెలలవరకు అమెరికా రేవులలోకి రాకుండ నిషేధింపబడును. యుద్ధంచేస్తున్న దేశాలు అమెరికా పతాకమును మోసంచేసే వుద్దేశంతో వుపయోగిస్తూ వుంటాయి. అమెరికా తటస్థదేశమగుటచే దాని పతాకం తగిలించుకొనుటచే శత్రువు లేమారిపోయి వాటిని కొట్టరు. అట్లా పెక్కు నౌకలు చేసినచో నిజమైన అమెరికా నౌకలు గూడ గుర్తించుట కష్టమగును. కాని యీ మోసం చర్యకు పైన దెలిపిన శిక్ష చాలునాయని సందేహంగావుంది. ఆ రీతిగా అమెరికా పతాకమును మోసబుద్ధితోవాడిన నౌకలు అమెరికా రేవులలోనే యుద్ధం ముగిసేవరకు వుండిపోవాలని శాసిస్తే యెక్కువ వుపయోగంగావుండును. లేదా సంగ్రామిక దేశ ప్రభుత్వములే యిట్లు అమెరికా పతాకమును దుర్వినియోగంచేయ వుత్తరువుచేసియున్నచో వీరి నౌకలను అమెరికా రేవు లన్నింటినుండి నిషేధించుట మంచిది. కాని అమెరికా అధికారానికి వెలుపలనున్న సముద్రాలలో యీ నియమం అమలుజరుపుట కష్టం.

## చట్టప్రయోజనం.

అమెరికా తాటస్థ్య చట్టం, అమెరికా యుద్ధంలో దింపకుండా వారించుటకు వుద్దేశింపబడినది. కాని అదివరకే యుద్ధంలోదిగిన దేశం అంతర్జాతీయ న్యాయనియమాలను తరుచుగ వుల్లంఘించుచూ, అమెరికా విధిగా యుద్ధంలో దిగునట్లు చేయవచ్చును. అపుడు యీ చట్టం అడ్డజాలదు. ఎట్టి పరిస్థితులలోనైనా పూర్తిగ తటస్థంగావుండాలంటే, అమెరికా చాల హక్కులను గోల్పోవలసియుండును. అది అమెరికాకు గౌరవ ప్రదంకాదు, అవమానకరం కూడాను. నౌకా యుద్ధంలో అనవసరమయిన వివాదాలకు దిగకుండాను, పరిమితిలేని ఆయుధ వ్యాపారంవలన యుద్ధంలో దిగిన రాజ్యాలతో ఆర్థికచిక్కు లేర్పడకుండుటకును తాటస్థ్య చట్టం వుద్దేశింపబడినది. దీని నియమాలను తప్పించుకొని గూడ ప్రభుత్వంవారు సంగ్రామిక రాజ్యాలకు సహాయంచేయ వీలౌసంగు లోపాలు యీ చట్టంలో లేకపోలేదు. అయినా, రష్యాకు మిత్రమండలికి అన్ని రకముల సహాయం అతివడిగా పంపుటకు యీ చట్టం ప్రతిబంధకంగానుందని కార్డెలు హలుగారు అభిప్రాయపడుతున్నారు. అమెరికా నౌకలందే అమెరికా ఆయుధాలు మందు గుండు యుద్ధంచేస్తున్న దేశాలకు పంపి, వాటికి అమెరికా యుద్ధ నౌకలు కాపలాయుండునట్లు వీలౌసంగుచు చట్టం మార్పుచేయబడవచ్చును. అందువలన మిత్రమండలితో ఆర్థికవ్యవహారముల చిక్కులు కూడా తొలగిపోతాయి. కార్డెలు హలుగారి సూచనపై యెట్టి చర్య జరుగునో శ్రద్ధగ గమనించబడును. రష్యా బ్రిటనులు నాజీతత్వమును అణచివేయడానికి అధికబలం సంపాదింప అతివడిగా అమెరికా సహాయం వాటికి చేరుట అవసరమని గుర్తించినవారంతా, యీ తాటస్థ్య చట్టం మార్పునకు యెదురుచూస్తున్నారు.

---

# ఇరానులో ప్రస్తుత స్థితి.

### పారిపోయిన షాను విచారణచేసి శిక్షించాలనుట.

ఇరానులోనికి మిత్రమండలి సేనలు ఆగస్టు 25 వ తేదిన ప్రవేశించుటకు కారణాలును, తదనంతర పరిస్థితులను వివరించుచు మేజరు జనరల్ జి. ఎన్. మోల్సువర్తుగారు జనరల్ స్టాఫ్ డిప్యూటి చీఫ్ రేడియోద్వారా యీ నెల 20 వ తేదిన ఉపన్యశించిరి. రష్యాపై జర్మనీ దాడి ప్రారంభించుటకు కొన్ని వారాల ముందునుండియే ఇరానులో అక్షరాజ్యాల గూఢచారుల ప్రచారంగూర్చి బ్రిటనుకి ఇండియాకు అనుమానం కలుగుచుండెను. ఇరాకు సిరియాలందు బ్రిటిషువారు ప్రవేశించిన పిదప అక్కడనుండిన జర్మను గూఢచారులలో పెక్కండ్రు ఇరాను ప్రవేశించి తమ పని సాగించు

చుండిరి. ముస్లిము రాజ్యాలలో ఆందోళన కలిగించడమే వీరి పని. వారిని తరిమివేయుమని బ్రిటిషు ప్రభుత్వంవారు కొన్నిసారులు హెచ్చరించినా షా గారు లక్ష్యంచేయలేదు. రష్యాపై జర్మనీ దాడి సాగించినాక, తూర్పు దేశాలపై దాడి చేయుటకు జర్మనీ వేసిన యెత్తులో చేరినదే ఇరాకు ఇరానుల లోని గూఢచారుల ప్రచారమని స్పష్టమయినది. వారు పరిశ్రమల వశపరచుకొనుచుండిరి. ముందు ప్రచారము మాత్రమే అనుకుంటిమి; కాని, అది ఇరాకు దేశానికి ఇండియాకు యితర ముస్లిము రాజ్యాలకు యెసరుపెట్టే చర్యగా మారినందున, ఇరానులో నాజీల సంఖ్య తగ్గించమని వేరొకసారి ఇరాను ప్రభుత్వాన్ని బ్రిటిషువారు కోరియుండిరి. షా గారు జర్మనీతో ఆర్థికసంబంధములేర్పరచుకొని, స్వంత ఆస్తి అభివృద్ధికిగాను దేశంసంపద జర్మనీకి ఒప్పగిస్తుండెను. జర్మనులను తరిమివేయుట ఆతని కిష్టంలేదని తెలిసినందున చివరకు మిత్రమండలి సేనలు ఇరానులో ప్రవేశింపవలసి వచ్చిందని మాలిసనుగారు తెలిపిరి. అక్షరాజ్యాల యేజెంటులను తరిమివేయుట, ఇరాను చమురు గనుల రక్షించుట, కాకసనునుండి ఇరానులోనికి రాధారి మార్గాలను కాపాడుట, యీ మూడే బ్రిటిషువారి ముఖ్యోద్దేశాలు. మొదటిది నెరవేరినచో మిగిలినవి సైన్యం పంప నవసరంలేకుండానే రాయబారాలతో నెరవేరియుండును. మిత్రమండలి సేనలను ఇరాను సైన్యం నిరోధించలేదు. ఇరాను పాలకుడు నిరోధం మాని బ్రిటిషువారి షరతులు తన మంత్రివర్గానికి యొరింగించెను. మిత్రమండలి సేనలు పరిమితప్రాంతాలలో కొంతకాలంవరకే వుండుననియు, జర్మనులను తరిమివేయాలనియు, రష్యాకు సరకు రవానాయేర్పాటులు ఇరానుగుండా జరుగాలనియు మాత్రమే షరతులు కోరబడెను. ఈ షరతులను మంత్రులంగీకరించినా రాజు అంగీకరించలేదు. అందుచే అప్పటికింకా స్వేచ్ఛగనున్న అక్షరాజ్యాల రాయబారుల ఆగడం మితిమీరిపోయింది. కావున మిత్రమండలి సేనలు రాజధాని నగరమగు టెహరానుకూడ ప్రవేశింపక తప్పినదికాదు. మంత్రులతో సరిపడనందున రాజుగారు పారిపోవలసివచ్చెను. క్రొత్త ప్రభుత్వానికి సహాయంచేయ నవసరం వుంటుందని బ్రిటిషు సేనలింకా టెహరానులో ఉన్నాయి.

రాజ్యపరిత్యాగంచేసి పారిపోయిన తరువాత, దేశంలో ఆతనిపై ద్వేషం అధికమయింది. పార్లమెంటు ఆతన్ని నేరస్తునిగా విచారణ చేయాలంది. ఆ విపత్తు ముందుగా ఊహించియే కాబోలును ఆతడు తన స్వంత ఆస్థి అంతా కుమారునకు యిచ్చి వెళ్లిపోయెను. అంటే ఆ ఆస్థి యిపుడు దేశానికి చెందుతుంది. అన్ని పరిపాలన శాఖలలోను, ఇరాను వ్యవహారములందును క్రొత్త శకం ప్రారంభమయిందని న్యాయశాఖ మంత్రి ప్రకటించెను. అక్షరాజ్యాలతో ఇరానుకు రాజకీయ సంబంధముండరాదను బ్రిటిషువారి కోర్కె నెరవేరుచున్నది.

కాని దేశంలో యింకను పూర్తిగ శాంతి పరిస్థితు లేర్పడలేదు. ప్రజలు మాత్రం బ్రిటిషు రషియా ప్రభుత్వముల సైనిక చర్యయందలి సదుద్దేశమును గ్రహించగల్గుచున్నారు. యూరోపులో యితర చిన్న రాజ్యాల దురవస్థ చూచినవారగుటచే నాజీలబానిసత్వం తప్పిందని సంతసించుచున్నారు.

---

# రషియాకు ఇండియా సహాయం.

## ఇండియా మంత్రి అమెరీగారి ప్రశంస.

ఇండియా మంత్రి అమెరీగారు మంగళవారంనాడు అబర్డీనులో ఉపన్యశిస్తు ఇండియాలో యుద్ధ ప్రయత్నాలకు జరుగుచున్న సహాయ కార్యములను, భారతీయ సైన్యాలు అబిసీనియా, ఇరిత్రియా ఇరాకు సిరియాలందు చేసిన ఘన కార్యములను కొనియాడిరి. రషియాకు సహాయంచేయుటకు పర్షియాద్వారా దారి ఏర్పరుచుటలోను ఇండియా సేనల కృషినిగూర్చి యిట్లు తెలిపిరి :—

"మనం రష్యాకు సహాయంచేయవలసిన అగత్యం తెలుస్తూనేవుంది. అందుకు ఉండే ప్రతిబంధకాలు అవ్యవధి దూరము మున్నగు భౌతిక చిక్కులుగూడ తెలియకపోలేదు. కష్టంలోనున్న రషియను సేనకు ఆయుధాల సహాయం ఎంతవడిగా పంపితే అంతమంచిది. అందుకు దారులు, రవానా సౌకర్యాలు అతివడిగా యేర్పరుచుకొనవలసియున్నది. ఈ మహత్తర కార్యంలోగూడ ఇండియా చాలా బాగుగ తోడ్పడుచున్నది. డిల్లీలో యితర అధినివేశ రాజ్య ప్రతినిధులతో కలసి సభచేసి, ఆయుధోత్పత్తి అత్యంత వడిగ అధికంగా తయారుచేయుటకు యీ అధినివేశ రాజ్యాల సంపదలన్ని కూడదీసి అన్యోన్య సహకారంతో కృషిచేస్తున్నది. ఆపని యిపుడు బాగా కొనసాగుచున్నది; అంత్య విజయమునకెంతయు తోడ్పడగలదు."

---

# రష్యా యుద్ధం.

## మూడు నెలలకు కీవు పట్టుబడుట.

## రష్యాకు అన్నిరకముల సహాయం చేరుతున్నది.

జర్మనీ - రష్యా యుద్ధంలో దక్షిణభాగమున రష్యా సైన్యములను నాశనంచేసి కీవు నగరమునకు మార్గనిరోధం తొలగించితిమని జర్మనులు ప్రకటించిన మూడు నెలలకు వారా నగరాన్ని వశపరచుకో కలిగిరి. ఉత్తర ఉక్రేను రాష్ట్రమంతకు రక్షణ శిబిరంగానుండిన కీవును గోల్పోవుట రషియనులకు చాలకష్టమేకాని మార్షలు బుడ్నీగారు తన సైన్యాన్ని ఉపసంహరించినపుడే కీవ్ పడిపోక తప్పదని యెంచబడెను. అప్పటికీ చాలవారములది నిలువరించుకొనగలిగెను. చివరకు గత శనివారంనాడు జర్మనులందు ప్రవేశింపగల్గిరి.

ఇపుడు రషియన్లు గొప్ప ప్రమాదము నెదుర్కొనుటకు సిద్ధము కావలెను. జర్మను సేనలు ఒకటి కీవ్‌కు ఉత్తరమున చర్నిగోవ్‌నుండియు వేరొకటి క్రెమంచగువద్ద నీపరు నది దాటి పోల్టావు చేరినదియు, కార్కోవు నగరముపైకి ఒకేసారి దాడి రాగలవు. ఇపుడు ఉక్రేను రక్షణకు ముఖ్యనగర మదియే. కీవువద్ద అయిదు లక్షల మందిని చుట్టవేసి బంధించితిమని మామూలు ప్రకారం జర్మనులు ప్రగల్భాలు ప్రకటింపసాగిరి. అది నమ్మ వీలులేదు. రషియనులు వదలిపోయిన ప్రాంతములను దగ్ధంచేసి పోవుచుండుటచేతను, కీవ్ తూర్పున రషియను సేనలు యింకను పోరుచుండుట చేతను, ఆనగరం ఖాళీచేయుట మంచి కట్టుదిట్టములతో జరిగిందని నమ్మవచ్చును. రషియనులు వెనుక విడచిన సేనలు జర్మను సేనలకు ప్రక్కదెబ్బలు కొట్టుచున్నవి. మార్షలు బుడ్నీగారి సేన డొనెట్జి నదివద్దకు పోయి పరి

శ్రమలుగల ప్రాంతములను కాపాడుచున్నది. ఒడెస్సా నగరం వశపరచుకొనుట జర్మను రుమేనియను సేనలకు ఎంత మాత్రం వీలుకాకున్నది.

మధ్యరంగమునందు మార్షలు టిమొషెంకోగారి రషియను సేన తిరుగు దాడులను తీవ్రంగా చేస్తున్నది. ఉత్తరమున మార్షలు వరషిలావ్‌గారి సేన లెనిన్‌గ్రాడు నగరాన్ని అమిత ధైర్య స్థైర్యములతో కాపాడుచున్నది. లెనిన్‌గ్రాడు ప్రాంతాలలో కొన్నిచోట్ల ఖాళీచేసి రావలసివచ్చిందని జర్మనులే అంగీకరించియున్నారు. ఉత్తర కొసను ఫిన్లాండు సేనలు లడోగాసరస్సునందు కొన్ని ద్వీపాలను వశపరచుకొన్నారటే గాని, రషియనులు సాధారణంగా శత్రుదాడిని బాగా ఎదుర్కొని నిలువరించుకొనుటేగాక శత్రువుల కెక్కువ నష్టం కలుగజేస్తున్నారనుట నిజం. లెనిన్‌గ్రాడు ప్రాంతములందు జర్మనుసేన పెక్కు రెజిమెంట్లు నాశనమయింది.

ఈలోగా రషియాకు సహాయం ఇంగ్లాండు, అమెరికా, ఇండియాలనుండి ప్రవాహంవలె వచ్చిపడుచున్నది. మాస్కోలో మూడు రాజ్యాల సభ జరిగేవరకు వేచియుండలేదు. జాపానుకి చేస్తానన్న సహాయం జర్మనీ యే విధంగాను చేయలేకుండా వుందిగాని, రషియాకు ఇంగ్లాండు చేస్తానన్న సహాయం పూర్తిగా చేయగల్గుచున్నది. రషియాకు మార్గాలన్ని ఇంగ్లాండు వశమందున్నాయి. రషియా వాంఛలలో కూడవ వంతు అపుడే ఇంగ్లాండు తీర్చెను. రషియాకు ఆయుధ యంత్రాగారాలు మంచివి ఉన్నాయి. కావలసిన ముడి పదార్థాలు రబ్బరు, వున్ని, బూట్లు, ఉన్నివస్త్రాలు, తోళ్లు, సీసం, జనుమునార, లక్క, పరిశ్రమలకవసరమగు వజ్రాలు విశేషంగా పంపబడుచున్నవి. సెప్టెంబరునకు పూర్వమే 150 లక్షల పౌనుల విలువగల సరకు రషియాకు పంపబడెను. సెప్టెంబరు 28 వ తేదితో అంతమయ్యే వారమునందు ఇంగ్లాండులో తయారయిన టాంకులన్ని రషియాకు పంపబడ్డాయి. రషియాకు అమెరికా 10,00,00,000 డాలరుల సరుకు అరువాసంగినది. చమురు టాంకులు రెండు వ్లాడివిస్టాకు రేవుచేరినవి. తొమ్మిది నౌకలుగూడ అక్కడికి పోతున్నవి. ఇంగ్లాండు కొరకై అమెరికాలో కట్టిన 200 ఫైటరు విమానాలు రషియాకు పంపబడెను.

# టర్కీ, బల్గేరియాలందు నాజీ కుట్రలు.

## డార్డెనల్సు జలసంధి వశపరచుకొన జూచుట.

## బల్గేరియాకు జర్మనీ అంత్య సందేశము : సందిగ్ధావస్థ.

చలికాలం ముదిరి మంచుగడ్డకట్టి సైన్యములు కదలడమునకు నిరోధాలు ఏర్పడేలోగానే, జర్మను సైనిక విమాన నౌకాబలమంతకలసి రషియావారి క్రిమియా ద్వీపకల్పము నాక్రమించి, తూర్పునకు దాడిసల్పి, కాకసను ప్రాంతములందున్న రషియను చమురుగనులను వశపరచుకోవాలని చూస్తున్నట్లు ఎంచబడుచున్నది. లేదా, జర్మనుసేన తూర్పునకు ఏష్యా మైనరు ద్వారాపోయి సూయజుకాల్వను వశపరచుకొని ఇండియాను బెదరించాలని యత్నించవచ్చును. బ్రిటిషువారు తెలివిగా ముందే ఇరాకులో జోక్యం కలిగించుకొని జర్మను కుట్రలు పడగొట్టుటచేతను, సిరియాను, ఇరాన్ను ఆక్రమించుటచేతను జర్మనీవారి పైఎత్తులు సాగుటకు బల్గేరియా, టర్కీలను యుద్ధంలోకి దింపితేకాని వీలులేకుండావుంది. జర్మను సేనలు రషియా తీరంగుండా కాకసను వరకు పోవలసియున్నపుడు దక్షిణానవున్న టర్కీ నుండి జర్మనీకి ఎట్టిభయం వుండరాదు. అందుకు తగిన హామీవుండాలి. టర్కీ ముఖ్యపట్నమగు అంకారాలోనున్న జర్మను రాయబారి వాను పాపనుగారు టర్కీ యుద్ధంలో చేరదనియు, అందుచే టర్కీని గూర్చి జర్మనీ భయపడనవసరంలేదనియు చెప్పుచున్నారని తెలియుచున్నది. అంతేకాని, ఇంగ్లాండుతోగల సంధి రద్దుచేసుకోవాలని జర్మనీ టర్కీకి షరతులు విధించినచో టర్కీ జర్మనీకి ఎదురు తిరగ్గలదని వారనుచున్నారు. నల్లసముద్రాన్ని మధ్యధరా సముద్రంతో కలుపు డార్డెనల్సు జలసంధి టర్కీవశమందున్నది. అందుచే అక్ష-రాజ్యాల చర్యలకు ఎంతో ప్రతి బంధకంగావుంది. ఈ జలసంధిద్వారా ఇటలీ స్టీమరులను నల్ల సముద్రంలోనికి పోనిచ్చి జర్మనీకి తోడ్పడ అవకాశమిచ్చేటట్లు టర్కీని ప్రోత్సాహించుట గూర్చి ఆలోచింప వాను పాపనుగారు బెర్లిను పోయివచ్చిరి. యుద్ధసమయాల్లో ఎవరి స్టీమరులను డార్డెనల్సు జలసంధి ద్వారా పోనీయరాదను మాంట్రో సంధి నియమమును యింతవరకు టర్కీ బాగా అమలు జరుపుతున్నది. ఈ వైఖరి మార్పించుటకు వీలులేదని జర్మనీ విచారించుచున్నది. ఈ మార్గం తమ కనువుగాగా వుంటేగాని జర్మను సేనలు కాకసను వైపు పోజాలవు. క్రిమియాకు సముద్రమార్గాలన్ని బలవత్తరమగు రషియా నౌకాదళం కాపలాయందున్నవి. డాన్యూబు నది ద్వారా కొన్ని నౌకలను, నౌకాభాగాలను నేలపై తీసుకవచ్చి నల్లసముద్రం రేవులలో అమర్చిన కొన్ని నౌకలనుమాత్రమే జర్మనీ ఆ ప్రాంతాలందు యిప్పటికి చేర్చగల్గెను. ఇవి రషియా నౌకాదళము నెదుర్కొనజాలవు. దక్షిణ రషియాయందు జర్మనుల దాడి తూర్పునకు దూరంగా సాగిన కొలది వారి సైన్యాలకు నల్ల సముద్రంగుండా సప్లైలువస్తే సౌకర్యంగా వుంటుంది. అంతేకాక నల్ల సముద్రం మధ్యధరా సముద్రముల రాధారి జర్మనులకు అనువుగావుంటే యూరోపులోని ఆక్రమిత ప్రాంతాల నుండి చమురు, బొగ్గు సులభంగా రవానా కావచ్చును. టర్కీని జర్మనీ తనవైపు త్రిప్పుకోకల్గినచో ఇరాను సిరియాలపై బడుటకు జర్మనీకి ఎంతో సులభమగును. అట్లుగాక టర్కీ మిత్రమండలితో చేరి బ్రిటిషు నౌకలు నల్ల సముద్రం చేరగల్గితే జర్మనీ పెద్ద ఎత్తులన్ని విఫలమవుతాయి.

టర్కీ జర్మనీ ఒత్తిడిని నిరోధించి సైనిక బలంతో ఎదిరించదలచినచో టర్కీ-రష్యా నౌకాదళములు రెండు చేరి, నల్ల సముద్రంలో జర్మనీ సహాయానికి వచ్చిన కొద్దిపాటి ఇటలీ నౌకలను మించినశక్తి కలిగియుండును. టర్కీస్థితి యిపుడు సందిగ్ధంగావుంది. టర్కీ గ్రీసు సరిహద్దులు దిట్టపరచబడెను. బల్గేరియా సరిహద్దునందు ఏడ్రియనోపుల్ అను ఘట్టి శిబిరం గలదు. కాని టర్కీ తీరానికి సమీపంలోనున్న గ్రీకు దీవులు యిపుడు జర్మనుల వశమందుండుటచే జర్మనుసేన సులభంగా టర్కీలో దిగగలదు. క్రీటు గ్రీసులు జర్మనీ వశమయినందున అచటి జర్మను విమానాలు కాపలా కాయుచున్నందున బ్రిటిషు నౌకాదళ సహాయం టర్కీకి చేరుట కష్టం. డార్డెనెల్సు జలసంధికి ద్వారంలోవున్న లామ్నాసుదీవులు స్మిర్నాకు దారిలోనున్న మైటిలీను జర్మనుల వశమందున్నాయి. డడకనీసు దీవులు ముఖ్యంగా రోడ్సుదీవి ఇటలీవారి వశమందుండుటచే టర్కీ తీరంపై అనేకచోట్ల విమానదాడి లేక నౌకాదాడి జరుపుటకు వీలున్నది. అట్టి దాడియే జయప్రదంగా జరిగినచో డార్డెనల్సుకు ఉత్తరమునందున్న టర్కీ భాగమునకు ముప్పే యగును. విమానబలం సహాయాన బల్గేరియా రేవులగు

బ్రెన్ ఫిరంగి బండి.

ఇరిట్రియాలో ఇండియాదేశపు సైన్యములు ముందుకు సాగుచున్నవి.



ఇరిట్రియా కొండప్రదేశము. ఇచ్చట ఇటలీ సైన్యాలు వెనుకకు తగ్గిపోవుచున్నవి. ఇట్లా వెనుకకు తగ్గిపోవుచుండు శత్రు సైన్యాలను వేరుపొందిన ఒక సిక్కు పటాళమువారు బ్రెన్ ఫిరంగుల సహాయముతో తరుముకొనిపోవుచున్నారు.

---

వర్నా బొర్గాసులనుండిగూడా నల్ల సముద్రంలో టర్కీ తీరంపైకి సైన్యాన్ని పంప వీలుండును.

టర్కీపై జర్మనీ దాడిసలిపి టర్కీ ఆత్మరక్షణకు యుద్ధమే చేస్తే ఎట్టి సహాయం కావాలో ఆ సహాయం అంతా ఇస్తామని ఇంగ్లాండు రష్యా ప్రభుత్వములు వాగ్దానం చేసినవి. బ్రిటిషు సహాయం డమస్కసునుండియు, మాసూలునుంచియు రైలు రోడు మార్గాలద్వారా టర్కీకి చేరగలదు. ఇండియానుండి దక్షిణ పర్షియా ఇరాకులద్వారా విమానదళ సహాయంకూడా రాగలదు. ఇండియాలో మానవశక్తి తామరతంపరవలె ఎంతేనాయుంది. ఆయుధాలుకూడ విశేషంగా తయారవుతున్నాయి. రషియనులు తమ నల్లసముద్రం రేవులద్వారా టర్కీ రేవులకు సహాయం చేయగలరు. కాకసనునుండి టర్కీకి విమానమార్గం, రైలు మార్గాలుగూడా గలవు. టర్కీ కొండలలో సీతకాలం మంచు జాస్తీగా నుండును. కావున సైనిక చర్యలు నవంబరులోగా ముగియాలి. రానున్న ఆరు వారాలు టర్కీకి గడ్డుదినాలు.

## బల్గేరియా.

బల్గేరియా విషయం అంతే. బోరిసు రాజుగారు సందిగ్ధావస్థలో పడ్డారు. రష్యాపై వెంటనే యుద్ధంలో దిగాలి లేకుంటే నీపై యుద్ధానికి వస్తానని బల్గేరియాకు జర్మనీ అంత్యసందేశం పంపిందట. బల్గేరియా ప్రజలు రష్యా కనుకూలురు కనుక అట్లాచేస్తే దేశంలో తిరుగుబాటు జరుగునని బోరిసు రాజుగారికి వారి ప్రభుత్వానికి తెలుసు. టర్కీపై శత్రుత్వం వహిస్తే బల్గేరియనులకు అంత కష్టంగా వుండదు. ఏమి చేయాలో ప్రభుత్వం యింకా నిశ్చయం చేయలేదు. కాని, ప్రమాదావస్థయున్నట్లు తగు సైనిక చర్యలు జరుపుచు ముందుగ ప్రకటించినారు. అక్షరాజ్యాలపక్షం చేరితే కబడ్దారు అని రష్యా అపుడే రెండు సందేశాలు బల్గేరియాకు పంపింది. బల్గేరియా రేవులను జర్మనీ ఉపయోగించి తనపై దాడి చేస్తువుంటే రష్యా చూస్తు వూరుకుంటుందా మరి. రషియా శిక్షిస్తుందన్న భయంచేతనైనా బల్గేరియా జర్మనీతో చేరకుండా వుండాలి.

బల్గేరియా ప్రాతచరిత్ర చూస్తే యీభయ్యేళ్లకు పూర్వం బల్గేరియా జాతీయోద్యమ పునరుద్ధరణకు రషియావే తోడ్పడినట్లు తెలియగలదు. 1912 వ సంవత్సరం వరకు యీ రెండు దేశాలు సఖ్యతగ వున్నాయి. 1914—1918 వ సంవత్సరములవరకు యూరోపు యుద్ధంలో బల్గేరియా కేంద్ర రాజ్యాలతో చేరింది. యుద్ధానంతరం రయితులు తిరిగి రష్యా కనుకూలంగా మారినారు. ఎంతో తటపటాయించి 1934 వ సంవత్సరములో బల్గేరియా, బాల్కను రాజ్యాల ఒడంబడికలో చేరింది. కాని యీ యుద్ధ ప్రారంభంలో అక్షరాజ్యాల ఒత్తిడివలన, 1941 వ సం॥ మార్చి నెలలో అక్షరాజ్యాల సఖ్యత ఒడంబడికలో సంతకం చేసింది. బల్గేరియా రయితాంగం రష్యా కనుకూలురగుటచే యింత వరకు బల్గేరియాను యుద్ధంలోకి జర్మనీ దించలేదు. కాని యుగోస్లావియా, గ్రీసు, రుమేనియాలలో రాజ్యభాగాలను బల్గేరియాకు లంచంగా యిచ్చి, బల్గేరియా జనబాహుళ్యాన్ని జర్మనీ తనవైపు మరల్చుకొనుచుండెను. అందుచే బల్గేరియా ప్రభుత్వస్థితి ముందు నుయ్యి వెనుక గొయ్యివలెనుంది. నాజీ ఒత్తిడికి లొంగిపోయి రషియాపై యుద్ధం ప్రకటిస్తుందేమో చూడాలి.

# ఈ వారంలో యుద్ధ వార్తలు.

## విమానదాడులు.

18 వ తేది గురువారమునాడు బ్రిటిషు విమానములు, జర్మనీ పడమటి భాగముపైనను, ఫ్రాన్సున ఆక్రమిత ప్రాంతములపైనను చాల దాడులు సాగించెను. అచట జరిగిన విమాన పోరాటములందు 16 శత్రువిమానములు పడగొట్టబడెను. 11 బ్రిటిషు విమానములు తిరిగి రాలేదు. బెల్జియము తీరమునకు సమీపముగా ప్రయాణమొనర్చుచున్న శత్రునౌకలను బ్రిటిషు విమానములెదిర్చి బాంబులువేసి, రెండు శత్రు నౌకల ముంచివేసెను. మరి మూడు నౌకలకు చాల దెబ్బలు తగిలెను. మందుగనులను తుడిచివేయు రెండు యుద్ధ నౌకలు ముంచివేయబడెను. శుక్రవారము రాత్రి రష్యను విమానములు, జర్మనీ రాజధానియగు బర్లిను నగరముపై దాడివెడలి చాల బాంబులను వేసెను. బ్రిటిషు విమానములు సెట్టిన్ అను పట్టణముపై వందలకొలది బాంబుల వర్షించి ధ్వంసమొనర్చెను. 20 వ తేది శనివారము పగలు బ్రిటిషు విమానములు ఫ్రాన్సు, జర్మనీ, నార్వే దేశములపై ఇదివరకన్నిటికంటెను బ్రహ్మాండమగు దాడుల సాగించెను. జర్మనీపై పోరాటమున 15 శత్రు విమానములు పడగొట్టబడెను. 10 బ్రిటిషు విమానములు తిరిగిరాలేదు. ఆ రోజు రాత్రి జరిగిన దాడులలో జర్మనీయందలి ఫ్రాంకుఫర్టు, బర్లిను మొదలగు పారిశ్రామిక నగరములపై వేసిన బాంబులచే చాల పెద్ద మంటలు లేచెను. 21 వ తేది ఆదివారము పగలు జర్మనీపై సాగింపబడిన దాడులలో బెదూన్ వద్ద విద్యున్నిర్మాణశాల ధ్వంసమొనర్పబడెను. 24 శత్రు విమానములు, 13 బ్రిటిషు విమానములు ఈ పోరాటమునందు ధ్వంసమొనర్పబడెను.

గత వారము దాడులలో 71 శత్రు విమానములు పడగొట్టబడెను. 62 బ్రిటిషు విమానములు నష్టమయ్యెను.

20 వ తేదిన బ్రిటనుపైన చాల స్వల్పమగు శత్రు విమాన దాడులు మాత్రమే జరిగెను. శత్రు బాంబులచే దక్షిణతీరమున ఇద్దరు గాయపడిరి. ఒక శత్రు విమానము ధ్వంసమొనర్పబడెను. 21 వ తేది ఆదివారము రాత్రిగూడ చాల తక్కువ శత్రు విమానములే బ్రిటనుపైకి వచ్చెను. స్వల్పముగ ఆస్తికి నష్టముగల్గెను. కొలదిమందికి దెబ్బలు తగిలెను.

## ఇటలీ, ఆఫ్రికా, మధ్యధరా.

లిబియాలో 18, 19 వ తేదీలలో పెద్ద ఇసుక తుపాను చెలరేగుటచే సరిహద్దులందుగాని, టొబ్రూకునందుగాని పెద్ద సంఘర్షణలు జరుగలేదు. లిబియాకు సైన్యములను చేరవేయుచున్న రెండు ట్రాన్సుపోర్టు నౌకలు, బ్రిటిషు విమానములచే ముంచివేయబడెనని ఇటాలియను అధికారులు 20 వ తేదిన అంగీకరించుచు ప్రకటన గావించిరి. లిబియా—ఈజిప్టు సరిహద్దులలో శత్రులు 20 వ తేదిన ముందుకు చొచ్చుకొనివచ్చుటకు ప్రయత్నించిరి. కాని వెనుకకు కొట్టివేయబడిరి. సోమవారమునాడు టొబ్రూకువద్దను, ఈజిప్టు సరిహద్దులందును, ఉభయపక్షములనుండియు శతఘ్నిదళముల పోరాటము తీవ్రముగ సాగెను. కొన్నిచోట్ల ఉభయ పక్షములకును సంఘర్షణలుగూడ కొంచెము తీవ్రముగనే జరిగెను.

19 వ తేది ఉదయము శత్రు విమానములు సూయజు కాలువ ప్రాంతముపై దాడులు సాగించి చాల బాంబులు వేసెను. ముగ్గురు మనుష్యులకు దెబ్బలు తగిలెను. ఆస్తి నష్టం అత్యల్పం.

ఈజిప్టు రాజధానియు, బహు పురాతనమగు పుణ్యతీర్థమును అగు కెయిరో పట్టణముపై అక్సిసు విమానములు బాంబులువేయుటచే అరబ్బీ జాతులుగల దేశములందు తీవ్రమగు అసంతృప్తిని వ్యాపించెను. రంజాను పండుగలలోగూడ విమానదాడి రక్షణ నిబంధనల నేమాత్రమును సడలింపకుండుటకు ఈజిప్టు ప్రభుత్వము నిశ్చయించుకొనెను.

## అమెరికా-అట్లాంటిక్.

అరువుకవులు చట్టముక్రింద, బ్రిటనుకు పంపుచున్న ఆయుధ సామగ్రిని, ఆహారపదార్థములను గొంపోవుచున్న నౌకలకు, అమెరికను యుద్ధనౌకలను ఇపుడు, రక్షణగా వెంటపంపుచుంటిమని అమెరికా ప్రభుత్వ నౌకాశాఖ కార్యదర్శియగు కర్నలు నాక్సుగారు 17 వ తేదీన వెల్లడించిరి.

అరువుకవులు చట్టముక్రింద బ్రిటనునకును ఇతర దేశములకును సహాయమొనర్చుటకుగాను క్రొత్తగా మరి 600 కోట్ల డాలర్ల సొమ్మును మంజూరుచేయవలసినదని రూజ్వెల్టు అధ్యక్షుడు 18 వ తేదీన, అమెరికను శాసనసభలకు సందేశమంపెను.

అమెరికా, ఈ యుద్ధములో దిగరాదనేపక్షమువారి బలము తగ్గిపోవుచున్నదనియు, వారిలో వారికే చీలికలు గలుగుచున్నవనియు న్యూయార్కు టైమ్సు పత్రికా విలేఖరి తెలుపుచుండెను.

అట్లాంటికు సముద్రమున శత్రునౌకల నిర్మూలించుటకును వానిని వెదకుటకును అమెరికను ప్రభుత్వము, నౌకలను, నౌకాదళమునందలి విమానములనేగాక, విమానదళ శాఖయందలి విమానములనుగూడ ఉపయోగించుటకు నిశ్చయించుకొనెను.

ప్రస్తుతము 12 బ్రిటిషు యుద్ధనౌకలు, మరమ్మతులకుగాను అమెరికా రేవులయందున్నవనియు, వానిలో పెద్ద యుద్ధనావయగు "వార్‌స్పైటు" అను నౌకగూడ గలదనియు అమెరికను అధికారులు ప్రకటించిరి.

అమెరికను "తాటస్థ్య" శాసనమును వెంటనే రద్దుచేసి, అమెరికను వర్తక నౌకలకుగూడ ఫిరంగులను అమర్పవలెనని, అమెరికను దేశీయాంగ కార్యదర్శియగు కార్డలు హల్లుగారు 21 వ తేదీన ప్రకటించిరి. 22 వ తేదీన ఐస్లాండునకు సమీప సముద్రమున, పింక్ స్టార్ అను అమెరికను నౌక ప్రయాణమొనర్చుచుండగా, శత్రు జలాంతర్గామిచే ముంచివేయబడెనని అమెరికను అధికారులు ప్రకటించిరి.

అమెరికను వర్తక నౌకలకు ఫిరంగులను అమర్చువిషయమై ఆలోచించుచుంటిమని రూజ్వెల్టు అధ్యక్షుడు 23 వ తేదీన ప్రకటించెను. అమెరికా తాటస్థ్య శాసనము ప్రతిబంధకముగనున్నదనియు, దానిని సవరించుట అవసరమనియు రూజ్వెల్టుగూడ, శాసనసభాసభ్యులకు దెలిపెను. "పింక్ స్టార్" నౌకను ముంచివేయుటచే, అమెరికా అధికారులు త్వరలోనే తగు ప్రతీకారచర్యలకు గడంగెదరని అనుకొనుచున్నారు.

## విషీ.

16 వ తేదిన జర్మను సైనికులపై ప్రజలలో కొందరు దౌర్జన్యములు జరిపినందుకు ప్రతీకారముగ తమవద్ద హామీగానుంచబడిన ఫ్రెంచి ప్రజలలో 12 మందిని కాల్చివేసితిమని పారిస్ యందలి జర్మను సైనికాధికారులు ప్రకటించిరి.

పారిస్ నగరమున ప్రజలలో కొందరు 19 వ తేదిన ఒక జర్మను సైనిక దళముపై తుపాకులు ప్రేల్చిరి. జర్మను సైనికులు తిరిగి ప్రజలపై తుపాకులు ప్రేల్చిరి. అయిదుగురు ఫ్రెంచి ప్రజలు హతులైరి. చాలమంది జర్మనుసైనికులకు గాయములు తగిలెను.

మార్షలు పెటెయిను 21 వ తేదిన విషీనుండి రేడియో ద్వారా ఫ్రెంచి ప్రజలకు హెచ్చరిక గావించుచు జర్మనుసైనికులపై దౌర్జన్య చర్యలకు గడంగుట నేరమనియు అట్టి నేరస్థులపై తీవ్రమగు చర్యలు జరుపబడుననియు దెలిపిరి. అట్టి దౌర్జన్యమువలన దేశమునకు క్రొత్తగా మరికొన్ని కష్టములు వచ్చిపడునని మందలించిరి

ఆక్రమిత ప్రాంతములలో బయలుదేరుచున్న తిరుగబాటుల నణచుటకికమీద సైనికులు, టాంకులను, సాయుధ సకవచ మోటారు శకటములను, మర ఫిరంగులను ఉపయోగింతురని ప్రకటింపబడెను.

19 వ తేదినుండి చీకటిపడిన తరువాత ప్రజలు వీధులలో తిరుగరాదని పారిసు నగరమున జర్మను అధికారులు ఉత్తరువుగావించిరి. ఆ యుత్తరువు నుల్లంఘించిరను కారణముచే 200 మంది అరెసు చేయబడిరి.

స్వతంత్ర ఫ్రెంచినాయకుడగు జనరలు డీగాలీగారు బ్రిటనునందు "ఫ్రీ ఫ్రెంచి నేషనలు కమిటీ" అను పేరుతో 23 వ తేదిన ఒక సంఘమును స్థాపించెను. ఇకమీద ఫ్రాన్సునకును, ఫ్రెంచి సామ్రాజ్యమునకును, రక్షణకర్తగ నీసంఘము వ్యవహరించునని ప్రకటింపబడెను.

## టర్కీ, ఇరాక్, ఇరాన్.

టర్కీయందున్న డార్డెనల్సు జలసంధిని బాస్ఫరస్‌ను లాగుకొనుటకు జర్మనీ కొలదికాలములలోనే ప్రయత్నించునని అబ్జర్వరు పత్రిక విలేఖరి సూచించెను. వానిని తనకు శాంతముగ ఇచ్చివేయవలెనని గోరుచు జర్మనీ టర్కీకి తుది సందేశమునంపెనని బలమగు వదంతులు వ్యాపించియున్నవి.

బల్గేరియా ఇదివరకే గ్రీసు, యుగోస్లావియాలపైన దాడి సాగించియుండుటచే ఇదివరకే యుద్ధదేశ మయ్యెననియు అందుచే బల్గేరియా పేరనున్న యుద్ధ నౌకలను డార్డెనల్సుగుండా పోనీయరాదనియు బ్రిటిషు ప్రభుత్వము టర్కీ ప్రభుత్వమును హెచ్చరించెను.

జర్మనీ-టర్కీలకు కొత్త వర్తక ఒడంబడికను కుదుర్చుకొనుటకు వచ్చిన జర్మను ప్రభుత్వ ప్రతినిధియగు డాక్టరు క్లాడియస్‌గారికిని టర్కీ ప్రభుత్వ ప్రతినిధులకును సంప్రదింపులు సాగుచున్నవి. వ్యవసాయిక పదార్థముల క్రయవిక్రయములగురించి సమాధానము కుదిరెననియు ఖనిజముల గురించి సంభాషణలు సాగుచున్నవనియు 21 వ తేదిన ప్రకటింపబడెను.

రాజ్యపదవిని త్యజించి వెడలిపోయిన మాజీషా రిజాఖాన్ పహ్లవీగారిని, ఇంతవరకును వారు గావించిన అక్రమములకుగాను నేరారోపణల నొనర్చి న్యాయస్థానము యెదుట బహిరంగ విచారణకు పెట్టవలెనని ఇరాన్ పార్లమెంటు కోరెను.

తన స్థిరచరాస్తుల నన్నిటిని తనకుమారుడగు క్రొత్త షాకు ఇచ్చివేయుచు రిజాఖాన్‌గారు ఇరాన్ ప్రభుత్వమునకు పత్రములు వ్రాసియిచ్చెను. క్రొత్త షా ఆ యాస్తులనన్నిటిని దేశమునకు యిచ్చివేసి ప్రభుత్వపు ఆస్తిగ జేసినట్లు ప్రకటించెను.

క్రొత్త షా వచ్చినపిదప 21 వ తేదిన ప్రధాని ఫరూకిగారు మరల క్రొత్త మంత్రివర్గము నేర్పరచి రాజ్యాంగసంస్కరణలగావించుటకు చాల విచారణ సంఘములు నియమించెను.

## నౌకా నష్టములు.

బ్రిటిషు నౌకాదళమున చేరి పని చేయుచున్న డచ్చి జలాంతర్గామి యొకటి ఒక 1,200 టన్నుల ఇటాలియను నౌకను, 6,000 టన్నుల స్ప్లై నౌకను ముంచివేసెను.

20 వ తేదిన డచ్చి తీరమున బ్రిటిషు విమానములు జరిపిన దాడులలో నాల్గు శత్రు విమానములు ధ్వంసమొనర్పబడెను. గత 18 వ తేదిన బ్రిటిషు జలాంతర్గాములు మధ్యధరా సముద్రమున యుద్ధ నౌకల రక్షణతో లిబియాకు సరకులను సైనికులను గొనిపోవుచున్న ఇటాలియను నౌకల నెదిర్చి వానిలో రెంటిని ముంచివేసెను. మూడవదానికి చాల దెబ్బలు తగిలి కుంటుపడెను. వీనిలో నొక్కొక్కటి 24,000 టన్నుల పరిమాణముండును.

## తటస్థ దేశములు.

స్పెయిను ప్రభుత్వము మంచూరియాయందు జపానీయులు యేర్పరచిన "మంచుకో ప్రభుత్వము" ను అంగీకరించి దానితో రాజకీయ సంబంధముల నేర్పరచుకొనెను.

స్వీడనుకు యుద్ధం ఇంకను సమీపమునకు రావచ్చుననియు అయినను స్వీడను తన తాటస్థ్యభావము నేమాత్రమును వదలదనియు, ఈ యుద్ధమున యే పక్షమునను చేరదనియు, స్వీడను ప్రధానమంత్రియగు హన్సన్‌గారు 20 వ తేదిన ప్రకటించిరి.

## రష్యా.

16 నుండి 50 వత్సరములవరకును వయస్సుగల రష్యను పురుషులందరును వెంటనే సైనికశిక్షణమందవలెనని రష్యా ప్రభుత్వము ఉత్తరువు గావించెను.

19 వ తేదీన, యుక్రేన్ రాజధానియగు కీవునగరమును ఆక్రమించితిమనియు, 380 వేల రష్యను సైన్యమును కైదీలుగా పట్టుకొంటిమనియు జర్మనులు ప్రకటించిరి. కీవు నగరమునకు తూర్పున 130 మైళ్లదూరమున, ఉత్తరము నుండి వచ్చుచున్న జర్మను సైన్యములును, దక్షిణముననున్న సైన్యములును కలుసుకొనెననియు కీవుకు తూర్పుననున్న ప్రాంతమంతయు ఈ విధముగ చుట్టుముట్టబడెననియు జర్మనులు ప్రకటించిరి.

ఉత్తరమున లెనిన్‌గ్రాడు నగరపు పొలిమేరలలో భయంకరమగు పోరాటము జరుగుచున్నదనియు ఉభయపక్షములును, లక్షలకొలది సైన్యములను అపారమగు మందుగుండు సామగ్రి నుపయోగించుచున్నవనియు 25 వ తేదీ వార్తలు దెలుపుచున్నవి.

ఉత్తరమున మర్మనిస్కు ప్రాంతమున జర్మను దాడులు పూర్తిగ తిరుగగొట్టబడెనని రష్యను సైనికాధికారులు 25 వ తేదీన ప్రకటించిరి.

బల్గేరియా ప్రభుత్వము తమ దేశమును, రష్యాపై దాడికి, శత్రులచే నుపయోగించుకొననిచ్చుటను ఆక్షేపించుచు రష్యా ప్రభుత్వము పంపిన హెచ్చరికకు బల్గేరియా ప్రభుత్వము 16 వ తేదీన సమాధానమొసగుచు రష్యను ఆరోపణలు నిరాధారమైనవని దెలిపిరి. ఈ సమాధానమును రష్యను అధికారులు నిరాకరించిరి. రష్యను సైనికులు, విమానాలమీదవచ్చి, ఆకాశ గొడుగుల సహాయంతో బల్గేరియాలో అచ్చటచ్చట దిగుచుండిరనియు బల్గేరియా ప్రభుత్వము 20 వ తేదీన వెల్లండించెను. ముందు జాగ్రత్తకొరకు, బల్గేరియాలో అవసరమగు సమస్త చర్యలను గైకొనుటకు బల్గేరియా ప్రభుత్వము అధికారము గైకొనుచు ఒక ఉత్తరువును ప్రక

టించెను. ఈ విషయమై బల్గేరియా ప్రభుత్వ ఆక్షేపణను రష్యను అధికారులు నిరాకరించుచు, రష్యను సైనికు లెవ్వరును బల్గేరియాలో దిగియుండలేదని ప్రకటించిరి.

రష్యాకు కోటి డాలరుల ఋణము ఇదివరకే యొసగబడెననియు, అవసరమునుబట్టి ఇకముందుగూడ, సమస్త సహాయమును గావింపబడుననియు అమెరికను కోశాధికారి యగు మార్గంథోగారు వెల్లడించిరి.

రష్యాకు సహాయము విషయమై సంప్రదించుటకు బయలుదేరిన, బ్రిటిషు, అమెరికను రాయబారవర్గములు 24 వ తేదీన మాస్కో చేరెను. అచట రష్యా ప్రభుత్వ ప్రతినిధులతో వెంటనే సంప్రదింపులు ప్రారంభమైనవి.

1939 వ సంవత్సరపు సరిహద్దులదాటి, ఫిన్నిషు సైన్యములు, రష్యా నింకను ఆక్రమింప ప్రయత్నించినయెడల బ్రిటను ఫిన్లండును యుద్ధదేశముగ పరిగణింపవలసియుండుననియు, ఫిన్లండు కోరుచో, రష్యాతో సంధి కుదుర్చుటకు తాము సిద్ధముగనుంటిమనియు బ్రిటిషు ప్రభుత్వము హెచ్చరించెను.

## దూరప్రాచ్యము.

రష్యనులు తమ సరిహద్దు సముద్రములలో మాటుపెట్టుకొనిన మందుగనులు తేలి జపాను సముద్రములోనికి కొట్టుకొనివచ్చుచున్నవనియు, జపాను నౌకలకు ప్రమాదకరముగ నున్నవనియు, దెలుపుచు, జపాను ప్రభుత్వము రష్యా ప్రభుత్వమునకు 17 వ తేదిన ఆక్షేపణపత్రము నందజేసిరి.

ఇటీవలి వారములలో జపాను, మంచుకో-రష్యా సరిహద్దులకు 10 లక్షల సైన్యమునైనను పంపియుండును అని చైనా అధికారులు దెలుపుచున్నారు. సరిహద్దులలో రష్యను సైనికులకు, జపాను సైనికులకు సంఘర్షణలు, పోరాటములు చాల హెచ్చిపోవుచున్నవి.

జపాను-అమెరికా వివాదములను పరిష్కరించుకొనుటకు వాషింగ్టను (అమెరికా) యందు జరుగుచున్న సంప్రదింపులలో సమాధానము కుదురక నిలచిపోయినవి. కాని, సంప్రదింపులు విఫలమైపోయెనని ప్రకటింపక మరల యెప్పుడైన సాగించుకొనుటకు వీలగునటుల ముభావముగ వదలియుంచిరి అని న్యూయార్కు టైమ్సుపత్రిక దెలిపెను.

దూరప్రాచ్యపరిస్థితులు చాల విషమములగుచున్నవనియు, తాయిదేశము ఏక్షణముననైన సంగ్రామమునకు గురికావచ్చుననియు, దెలుపుచు, తాయిప్రభుత్వ ప్రధానమంత్రి ప్రజలను హెచ్చరించెను.

మంచూరియాను జపానీయులు ఆక్రమించి పది వత్సరములైనది. 17 వ తేదిన చైనాయందీవిషయమై స్మారకసభలు జరిగెను. చైనా ప్రభుత్వ నాయకుడగు చాంగ్ కై షేక్‌గారాసందర్భమున ఉపన్యసించుచు, చైనా, మంచూరియాలలో జర్మనులు ఆక్రమించుకొనిన ప్రాంతములనన్నిటిని జపానీయులు ఖాళీచేసినగాని చైనీయులు సంధికి అంగీకరింపరని ప్రకటించెను. ఈ దశమస్మారక దినసందర్భమున కాంటను నగరములో చైనా విప్లవకారులు చాల దౌర్జన్యచర్యలకు గడంగిరి. అందుచే ఆనగరము నాక్రమించియున్న జపాను అధికారులు సైనికశాసనమును అమలుపరచిరి.

కాంటనునగరమునకు ఈశాన్యప్రాంతములలోని చైనా సైన్యముల తరిమివేయుటకుగాను జపాను సైనికాధికారులీవారము దాడుల ప్రారంభించిరి.

హూనానురాష్ట్రమున జపాను నెలకొల్పిన చైనా సైన్యములుకొన్ని తిరుగబాటుచేసెననియు, సైనికులు తమ జపానీయ అధికారులను చంపిరనియు, జపాను అధికారులు ప్రకటించి తిరుగబాటుదార్లందరను చుట్టుముట్టి పట్టుకొనుచుంటిమని దెలిపిరి. ఈరాష్ట్రమున జపానుదాడులు పూర్తిగ తిరుగగొట్టబడెననియు, శత్రువులు ఎచటను ముందునకు రాగలుగలేదనియు చైనా అధికారులు ప్రకటించిరి.

24 వ తేది రాత్రి స్వల్పముగ శత్రువిమానములు బ్రిటనుపైకివచ్చి, సముద్రతీరపు పట్టణములపై పలు ప్రదేశములలో బాంబులువేసినవి ప్రజలలో కొంతమంది మరణించిరి. ఆస్తికి యెక్కువ నష్టము గలుగలేదు.

## ఆక్రమిత ప్రాంతములు.

యుగోస్లావియాలో, జర్మనులకులొంగి పరిపాలన సాగించుచున్న అధికారులకును, స్వాతంత్ర్యముగోరు ప్రజలకును దేశమంతటా పోరాటములు జరుగుచున్నవి. దేశము ప్రతిచోటను ప్రజలు తిరుగుబాటు చేయుచున్నట్లు వచ్చుచున్న వార్తలు అక్సిను అధికారులకు ఆందోళన కల్గించుచున్నవి. అందుచే యుగోస్లావియా యందంతటను సైనిక శాసనము అమలు జరుపుచు అధికారులు ప్రకటన గావించిరి.

యుగోస్లావియా పంపకమునుగురించి రుమేనియాకును హంగరీకిని వివాదము అధికమై కలహములలోనికి దిగుచున్నది.

సలహా: ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.
[మదరాసు సమాచారముల డైరెక్టరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.